విభీషణునకు నే నొసంగినమాట చెల్లింపలేక పోయెదనేమో
యని నా హృదయము భీతిల్లుచున్నది.

లీలామానుష విగ్రహుడు, భగవంతుడు నగు శ్రీరాఘ
వేంద్రుని నయనముల నుండి అశ్రువులు ప్రవహింపనారం
భించెను. కరుణాభరిత మగు ఆయన విలాపమును గాంచి
వానర భల్లూకవీరులు అధైర్యముచెంది విలపింప నారంభించిరి.
వారు దుఃఖించుచు మాటి మాటికి ఆకసము వంక చూచు
చుండిరి. ఆంజనేయస్వామి వచ్చు నేమో యనివారి యాశ.
సూర్యోదయసమయ మాసన్నమగుచుండెను. వానర వీరు
లందఱు నిరాశాహృదయులైరి. సూర్యునివలె ప్రకాశించు
చున్న ఓషధిపర్వతమును హస్తమునందు ధరించి 'జయ శ్రీ
రామ' యని జయ జయారావములను పలుకుచు ఆంజనేయుడు
ఆకాశమార్గమున ఆ ప్రదేశమును చేరెను. పర్వతమును ప్రక్క
నుంచి మారుతి శ్రీరామచంద్రుని చరణములపై బడెను.
వానర వీరుల యానందమునకు మేరలేదు. వారందఱు ఆంజ
నేయుని వివిధ రీతులతో కీర్తింపనారంభించిరి. ఇంతలో సుషే
ణుడు పర్వతమునుండి సంజీవని దెచ్చి లక్ష్మణునకు వాసన
చూపించెను. నిద్రనుండి మేల్కాంచుచున్నట్లు లక్ష్మణుడు
లేచినవాడై యిట్లుపల్కెను. "మేఘనాథు డెక్కడ? వానికి
మరణమాసన్నమైనది.

మూర్తీభవించిన కృతజ్ఞతలో శ్రీ రఘునాథుడు ఎంత
గనో ప్రసన్నుడై ఆంజనేయుని తన వక్షఃస్థలమునకు హత్తుకొని
యిట్లుపల్కెను.

శ్లో॥ మారుతిం ప్రాహ వత్సాద్య త్వత్ప్రసాదాన్మహాకపే।
నిరామయం ప్రపశ్యామి లక్ష్మణం భ్రాతరం మమ॥
(అధ్యాత్మ రామాయణం 6-7.8)

వత్సా! మహాకపీశ్వరా! నేడు నీ కృపావిశేషము వ
వనే నేను నా సోదరుడైన లక్ష్మణుని నిరామయునిగ గాం
గల్గుచున్నాను.

వజ్రాంగబలి యగు ఆంజనేయుడొనరించిన యీ మహ
త్తర కార్యమును శ్రీరాముడు, పునర్జీవితుడును పొందిన లక్ష్మ
ణుడు ప్రశంసించుటయేగాక వానరభల్లూక వీరులందఱు
నోళ్ళ పొగడనారంభించిరి. కాని అభిమానశూన్యుడైన ఆంజ
నేయుని హృదయములో ఎట్టి అహంకారము కలుగలేదు. తా
నేమియు చేయనివానివలె ఆయన మిన్నకుండెను. అంతయు
చేయువాడు మరియొకడు కలడని, ఆయనయే అఖిలాండకోటి
బ్రహ్మాండనాయకుడైన శ్రీరామచంద్రుడని, తాను కేవలము
నిమిత్తమాత్రుడనని ఆంజనేయుని భావము. అతడు ఒంటరిగా,
అందరినుండి దూరముగ నుండి మనస్సులో అరుణకమలముల
వలె ప్రకాశించు సుకోమలములగు ప్రభువుయొక్క చరణా
రవింద ధ్యానములో లీనుడయ్యెను.

ఇది శ్రీకృష్ణపరమాత్మ చరణారవిందమిళిందాయమా
మానసత్వ మహావైభవ సంపన్నుడు శ్రీ మట్టుపల్లి వేంకట
మహాలక్ష్మి జగన్నాథుల తనూభవుడు భక్తజన దాసాను
దాసుడు సుజన విధేయుడు నగు శివ సుబ్బారాయ గుప్త చే
ప్రణీతంబైన శ్రీ హనుమద్భాగవతమందు పూర్వ భాగము
సమాప్తము.

శ్రీ హరిః ఓం తత్సత్

